# వెన్నెలవాడ

(గేయ నాటికలు)



సి. నారాయణరెడ్డి



సరోజా ప్రచురణలు

హైదరాబాదు.

అంకితం

సుప్రసిద్ధ చలన చిత్ర దర్శకులు
కళా ప్రియులు, అస్మదాప్తమిత్రులు

శ్రీ బి. యన్. రెడ్డి గారికి

# ముందుమాట

ఈ సంపుటిలోని 'వెన్నెలవాడ' బహుళ ప్రచారమందిన గేయ నాటిక. అందువల్ల ఈ సంపుటిని ఆ పేరనే ప్రచురిస్తున్నాను. ఈ సందర్భంలో 'వెన్నెలవాడ' ను గురించి ఒక రెండు మాటలు చెప్పవలసి ఉన్నది. ఇది మొదట ఆలిండియా రేడియో హైద్రాబాదు కేంద్రం నుండి ప్రసారమైంది. తరువాత తెలంగాణా రచయితల సంఘం వార్షికోత్సవాలలో కుమారి యం. జానకిరాణి గారు నృత్యనాటికగా ప్రదర్శించారు. పాలగుమ్మి విశ్వనాథం గారి సంగీత దర్శకత్వం, జానకిరాణిగారి నృత్యదర్శకత్వం, చిత్తరంజన్ ప్రభృతుల గాంధర్వం, సమష్టిగా రూపొంది 'వెన్నెలవాడ' కు అపూర్వ విజయాన్ని చేకూర్చినవి. ఆ తరువాత ఆంధ్రాభ్యుదయోత్సవాలలో నటరాజ రామకృష్ణగారి దర్శకత్వాన, ఆంధ్రయువతీమండలిలో బాలానంద సంఘంవారి యాజమాన్యాన, జయప్రదంగా ప్రదర్శింపబడింది. ఇంకా బందరు మున్నగు ప్రాంతాలలో ప్రదర్శింపబడి విశేష ప్రచారాన్ని అందుకున్నది.

మిగతా నాటికల్లో అజంతాసుందరి, నవ్వనిపువ్వు ఇంతవరకు నా గేయనాటికా సంపుటాల్లో వచ్చినవే. వాటి ప్రతులు ఐపోవడం వల్ల ఆ రెండు నాటికలను మాత్రమే ఈ సంపుటిలో చేర్చినాను.

ఈ నాటికల్లో వెన్నెలవాడ, గోకుల విహారం, నవ్వని పువ్వు, అజంతాసుందరి, రంగస్థలంమీద నృత్యనాటికలుగా ప్రదర్శింపవచ్చు. పాడుకోవడానికేగాక ప్రదర్శనలకు సైతం పనికివస్తాయనే దృష్టితో నేనీ సంపుటిని ప్రచురిస్తున్నాను. సహృదయులూ, నాటక సంస్థలూ, వీటిని సద్వినియోగం చేసుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ చిన్న సంపుటిని ప్రసిద్ధ చలన చిత్ర దర్శక నిర్మాతలు, కళా స్రష్టలు, విశేషించి నా ఆప్త మిత్రులు, అయిన శ్రీ బి.యన్. రెడ్డి గారికి అంకిత మిస్తున్నాను. రెడ్డిగారు శబ్దపరిమళ మెరిగిన రసజ్ఞులు. కావ్యాలలోని సన్నివేశాల మెలకువలనూ, పదచిత్రాల సొగసులనూ, చిన్న చిన్న పల్లుల జెనకాల వినిపించే కిన్నెర రవళులనూ, ఇట్టే గ్రహించి, మస్తక మూపే మధుర హృదయులు. మైత్రీచిహ్నంగా నేను పరచిన 'వెన్నెలవాడ' లో విహరించడానికి వారంగీకరించడం నాభాగ్యవిశేషం.

తొలుత ఈ నాటిక లన్నిటినీ ప్రసారంచేసిన ఆలిండియా రేడియోవారికి, తరువాత వీటిలో కొన్నిటిని ప్రచురించుకున్న ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ మున్నగు పత్రికలకూ, ఇప్పుడీ సంపుటికి ముద్రణ రూపమిస్తున్న యువ ప్రెస్ వారికీ, ప్రూఫులు చూడడంనుంచి పుస్తకానికి వన్నె చిన్నెలు దిద్దడం దాకా నిర్వహించిన నా సహచరుడు గూడూరి సీతారాంకు కృతజ్ఞుణ్ణి.

హైదరాబాద్
15 ఆగస్టు '59

— సి. నారాయణ రెడ్డి

# విషయసూచిక





నేపథ్య గానం :

శరదాగమనం
శరదాగమనం
సరదాలూ సరసాలూ
విరిసిన మందార వనం
శరదాగమనం.

నిన్నటిదాకా గుండెల
నీరు నీరుగా జేసిన
నీరదాల నిష్క్రమణం
నేడే శరదాగమనం.

మత్తేభాల విధమ్మున
మల్లాడిన మబ్బుగములు
భుజగమ్ముల చందమ్మున
బుసకొట్టిన కొనమెరుపులు
తలలువంచి ఎటకో పరు
వులు దీసిన శుభసమయం.
శరదాగమనం
శరదాగమనం.

ఈ చల్లని శరద్రాత్రిలో
ఈ సరసీ దివ్య ధాత్రిలో
ఓ చిన్ని కలువలారా!
ఓ కన్నె కలువలారా!
మీరుగూడ నింగిలోని
తారలవలె నవ్వండీ
తారుణ్యపు వెల్గులతో
తారలై అయిపోవండీ.
ఓ కలువలారా!
రేకుల చెరసాలల నిదు
రించే వలపులారా!
ఓ కలువలారా!
ఓ చెలువలారా!

[కొలనులో కలువ మొగ్గలు చంద్రుని రాకకు నిరీక్షిస్తుంటాయి. విరహబాధ కోర్వక నృత్య గీతాలలో కాలం గడుపు తాయి]

కలువలు :

రారా వెన్నెల దొరా
రారా వన్నెల దొరా
రారా మా గుండియలు పొం
గారా చిన్నెల దొరా!

అన్నె మెరుగని పున్నె మెరుగని
కన్నె కలువల చిన్ని మనసుల
నిప్పులను రగిలించి దాగుట
నీకు న్యాయము కాదురా !

రారా నీ రాకకై మా
రాణి తూరుపువైపు మోమిడి
పేరు పేరున పిలిచెరా మన
సార నిన్నే వలచెరా !

రారా వెన్నెల దొరా
రారా వన్నెల దొరా !

**రాణి :**

రాడేమే నా ప్రియుడు
ఏడీ నా కళామయుడు?
తెలుపరే చెలులారా ఏ
తెంచునా అమృతాలయుడు.

రెండు నెలలై పోయె గాదే
రేయిరాయని జూడలేదే !
ఈ శరన్నిశలోన సైతము
నా శశాంకుని జూడలేదే !

కలువ 1.

ఎంత నిర్దయుడాయెనే రేడు
ఎంతగానో పిలిచినా రాడు.

కన్నులను అరమూసి చంద్రుని
కై తపించెదవేల రాణీ ?
మించు తారల వీడి భువి కే
తెంచునా మన వెర్రిగానీ.

రాణి :

చెలియరో మనరాజుపై నిం
దలను వేయగ బూనకమ్మా !
కలువ కన్నెలపైన ప్రాణ
ములను నిల్పినవాడు సుమ్మా !

ఎన్నొమారులు మనల కలియగ
మిన్నులను దిగ సాగినాడే.
మదగజమ్ములవంటి మేఘా
లెదురు నిల్వగ నాగినాడే.

నేడు శరదవతరణ మయ్యెను
నీ రదమ్ములు బీరువోయెను.
నిజముగా మన చందురుడు మరు
నిముసమున నేతెంచునమ్మా.

అతడు వచ్చెడు నంతలో నృ
త్యములతో మైమరచి పోదము.
అతడు రాగానే పరిమళ
మతిశయిల్లగ నవ్వుకొందము.

*కలువలు :*

రారా వెన్నెల దొరా!
రారా వన్నెల దొరా!

*రాణి :*

కలికి నవ్వుల కింకిణులతో
వలపు మోపుల కిన్నెరలతో
కలువ నెలతలు నాట్యమాడిరి
కల గళమ్ముల నెత్తిపాడిరి.

*కలువలు :*

రారా వెన్నెల దొరా!
రారా వన్నెల దొరా!

*కలువ 2.*

ఎడదలోపల సుడులు దిరిగెను
గడుసు భావనలూ.
నరము నరమున తురగలించెను
తరుణ యౌవనమూ.

కలువలు :

రారా వెన్నెల దొరా!
రారా వన్నెల దొరా!

చంద్రుడు :

[ఉదయిస్తూ]

ప్రాచీ గిరీంద్ర శిఖ
ర ప్రథమ సోపాన
మున తొల్లిపాద మ
ల్లన వేసితినో లేదో;

ఎటునుండి వినిపించె
నీ బృందగానమ్ము?
ఏ అప్సరసల అం
దెల కుణుక్వాణమ్ము?
ఎటునుండి వినిపించెనో?

కలువలు :

రారా వెన్నెల దొరా!
రారా వన్నెల దొరా!

ప్రేమోదయజాలని హృదయగాన
మ్మున ధ్వనించితిమి.

మోయజాలని ప్రణయభార
మ్మున తపించితిమి.

రారా వెన్నెల దొరా!
రారా వన్నెల దొరా!

*చంద్రుడు :*

ఓహో నా కలువ కన్నెలారా!
ఓహో నా వలపు వన్నెలారా!

మీయార్తరవమ్ము గుండె
లోయలోన మార్మ్రోగెను.
మీ కలగానమ్ము మనసు
లో కలవర మిడ సాగెను.

మీతో నడయాడుట కిది
గో తరలెద నీ క్షణమున.
మీ చేతుల చేయిడి పయ
నించెద నీ నిశీధమున.

ఓహో నా కలువ కన్నెలారా!
ఓహో నా వలపు వన్నెలారా!

కలువ 1.

అదుగో అదుగో రాణీ!
ఉదయాచల ఫాలమందు
కనుపించెను

రాణి :

ఎవరే ?

కలువ 2.

ఇంక నెవ్వరే
ఇందు మూర్తియే.

రాణి :

నిజముగనే నాథుడు క
న్పించెనటే చంద్రముఖీ !
ఆనందాశ్రువుల వలన
కానజాలనైతి సఖీ !

ప్రాణేశ్వర ! గగనసీమ
పై నిల్చుట తగునా ?
నీ ప్రేయసి కొరకైనా
నింగినుండి దిగవా ?

ఎన్ని యుగములాయెను ని
న్నే జపించుచుంటి.
మొలక వలపులన్ని నీకు
ముడుపుగట్టి యుంటి.

*కలువలు :*

రారా వెన్నెల దొరా!
రారా వన్నెల దొరా!

[ మేఘం చంద్రుణ్ని కప్పేస్తుంది.
కలువలు వెలవెల బోతాయి. ]

*కలువ 1.*

అయ్యయ్యో మనరాజును
ఆవరించె మేఘుడు.
మన బాధామయ గాథను
వినువాడింకెవ్వడు ?

ఇంకెక్కడి ఇందుమూర్తి
యే కలువల రాణీ!
కలుషాత్ముడు మేఘుడదో
కబళించెను ప్రియుని.

రాణి :

ఏమేమీ మేఘుడు ప్రా
ణేశ్వరు నెడబాపెనా ?
మనతేనియ గుండెల విష
మయ కీలలు లేపెనా ?

ఈ నాటికి మన కోరిక
లెండమావు లేనా ?
ఇందుమూర్తి సంయోగం
ఎగిసిన కలయేనా ?

పంచభూతములే మనకు
పరమాప్తము లెపుడు
వారిలోన మేఘాలకు
వైరి వాయు విభుడు.

వాయుదేవ ! మా మొర నీ
వైన ఆలకించవా ?
మా చంద్రస్వామిని దయ
తో చెరవిడిపించవా ?

[ ప్రబల ఝంఝూమారుతం వీస్తుంది. ]

నేపథ్యగానం :

కలువ నెలతల గుండె
కలచు ఆర్తరవమ్ము
తన యెడదలోన సుడు
లను కల్గజేయంగ;

అదిగొ పవనస్వామి
అతివేగమున ముందు
కురికి మేఘుని మెడలు
విరిచి నేలకు ద్రోసె.

అప్పుడప్పుడె రచిత
మైనట్టి చెంగల్వ
పూల గుచ్ఛము లీల
పొలిచె రాకేందుండు.

చందురుని వెలుగు హ
స్తాలు సోకినయంత
విరహ మూర్ఛితలైన
వేల కలువలు లేచె.

కలువలు :

అదుగో వెన్నెల రాయడు
కలువల రాణీ
అదుగో వన్నెలరాయడు.

మనకొరకు ఆకాశ గమనము
మాని క్రిందికి దిగెను చూడే.
సరసిలో మనతోడ క్రీడలు
సలుపగా విచ్చేసినాడే!

*రాణి :*

రారా వెన్నెల దొరా!
రారా వన్నెల దొరా!

*చంద్రుడు :*

ఓహో నా కలువ కన్నెలారా!
ఓహో నా వలపు వన్నెలారా!

మీరు చకోరములవోలె
మిన్నులపై కెగిసిరారు
తారలవలె మీరంబర
ధామమ్మున నిలువలేరు.

అందులకే మీకొరకై
అవతరించినాను భువికి.
అందరమూ కలిసి శరద్
యాత్ర సల్పుదాము దివికి.

క్షణము సేపు సరసిలోన
జలకేళిక లాడుదాము

క్షణము సేపు భూమిపైన
స్వర్గమ్మును దించుదాము.

ఓహో నా కలువ కన్నెలారా!
ఓహో నా వలపువన్నెలారా!

[చంద్రుడు ఒక్కొక్క కలువను స్పృశిస్తాడు.
కలువలు కిలకిలా నవ్వుతాయి.
కొలనిలో నీళ్ళు గలగల ధ్వనిస్తాయి.]

కలువలు :

వెన్నెల దొరా చిన్నెల దొరా!
వన్నెల కలువల కన్నెల దొరా!

రాణి :

గుండెలలో దాగుండిన ప్రేమల
దండలన్ని నీ కొరకే.
పెదవుల లోపల ఒదిగిన నవ్వుల
సుధలన్నీ నీ కొరకే.

నీ నునువెల్గుల చేతులలో బం
దీనైపోదునురా.
నీ వెన్నెల సామ్రాజ్యంలో రా
ణీనైపోదునురా.

కలువలు :

వెన్నెల దొరా చిన్నెల దొరా !
వన్నెల కలువల కన్నెల దొరా !

చంద్రుడు :

కలకాలం మన ప్రేమలు
నిలుచుగాత రాణీ !
నేను సదా కలువలదొర
నే బంభరవేణీ !

ఈ శారదవేళ మన క
నేక తపమ్ముల ఫలమ్ము.
ఈ పావనవేళ స్వర్గ
మై పోయెను భూతలమ్ము.

ఓ కలువల రాణీ !
ఓ మంజుల వాణీ !

వాయుగానం :

శరదాగమనం
శరదాగమనం.



ప్రియుడు :

సంధ్యాలతాంగి వీక్షణ మాత్రమున నింగి
ఎనలేని తారకలు మిణుకు చూపిన భంగి
నా చెలియ చిరునవ్వు నవ్వినంతనె విశ్వ
వాటి లోపల కోటి కోటి దివ్వెలు పూచు.
నవ్వవే ఒకమారు నా యనుగు నెచ్చెలీ!
నా యిరుల బ్రతుకులో నేడె దీపావళి.
నవ్వవే - నవ్వవే - నవ్వవే !

ప్రేయసి :

యుగయుగమ్ములనుండి బిగిసిపోయిన గుండె
నీ నుడులు సోక వీణియగ మ్రోగుచునుండె
నవ్వెదను నవ్వెదను నా వలపు రేడా!
నవ్వు నవ్వున కోటి దివ్వియలు పాడా

[ప్రేయసి కిలకిలా నవ్వుతుంది]

వాయుగానం :

దివ్వెలు దివ్వెలు దివ్వెలు
దివ్వెలు వెల్తురు నవ్వులు ॥దివ్వె॥
పిల్లగాలి సోకగనే
ఉల్లము దుసికిల్లగనే

ఘల్లురనక మెలమెల్లన
కదిలే వెల్తురు మువ్వలు ॥దివ్వె॥

మసక చీకటులు తీగెల
మాదిరిగా సాగిపోవ
పసిడివన్నె తళుక్కులతో
హాసించు వెల్తురు పువ్వులు ॥దివ్వె॥

దివ్వెలవదో నింగి ముంగిటా
దివ్వెలివదో పుడమి వాకిటా

జవ్వని చిరునవ్వులే దివ్వెలుగా
దివ్వియలే జవ్వని చిరునవ్వులుగా
నివ్వటిలిన నిముసమ్మేనాడే
నిఖిలభువికి దీపావళి నేడే.

దివ్వెలు దివ్వెలు దివ్వెలు
దివ్వెలు వెల్తురు నవ్వులు ॥దివ్వె॥

ప్రియుడు :

చెలియా - చెలియా -
నలువైపుల దివ్వెల వెలుగుల పులకలు పూచె
చెలియా నీవే లేవైతివి చీకటిదోచె.

ఇరు చేతులందు చిరుదివ్వె లందుకొనిరావే
ఇరులందు పూర్ణశశి బింబమై పోవే.
చెలియా - చెలియా !

ప్రేయసి :

ఓహో నా తీయని చెలికాడా !
ఓహో గుండెల దోచిన వాడా ! ॥ఓ॥

విరహాంవలె ముసురుకొన్న
ఇరుల తెరల పారద్రోల
వలపు దివ్వె లింటినిండ
వెలింగించుచున్న దాన ॥ఓ॥

విశ్వ మ్మినాడు స్నేహ
వీచికలం దేలిపోయె
మానవాత్మలే వత్తుల
మాదిరిగా వెళ్గిపోయె ॥ఓ॥

నిత్యము నీ ముంగోల నిల్చు
నే నెందుకు ? చూడు మహో
మింటిలోన తారల సంగీతం
మేదిని పై వెలుగుల జలపాతం ॥ఓ॥

## తారల సంగీతం :

తారలం - తారలం -
వెన్నెల రాయని చిన్నారి పొన్నారి దారలం ॥తా॥

మింటి శిరసుపై ఒంటిగ మెరిసే
శాశ్వత తేజస్సాధము జేర్చగ
వెలసిన పూవుల దారులం
వెన్నెల రాయని దారలం ॥తా॥

కమల బాంధవుడు కన్ను మూసికొన్నపుడు
కువలయాప్తుడే అవతరించ కున్నపుడు
చిరువెల్గులతో జీవకోటులను
కాచే సన్నని కాంతిధారలం ॥తా॥

గాలి తాకిడికి కలవర పోయే
మట్టి దివ్వియలు మాతో సరియా ?
రివ్వున ఎగిసీ జివ్వున ముగిసే
తారాజువ్వల సౌరదియెంత ?

తారలం - తారలం-
వెన్నెలరాయని చిన్నారి పొన్నారి దారలం॥

**దివ్వెల సంగీతం :**

విన్నారా దివ్వెలార మీరు
తారమ్మలు
వినిపించిన సంగీతం తీరు ॥విన్నా॥

మనము గాలి తాకిడిచే
వణకిపోవు వారమంట
మబ్బుతునక ఎదురైతే
మాసిపోదు రెవరంట ? ॥విన్నా॥

కలకాలం మసక వెల్తు
రులతో జీవించు కన్న
ఒకరాతిరి ఉజ్వలముగ
ప్రకాశించుటయే మిన్న ॥విన్నా॥

మట్టి దివ్వెలైన నేమి
పసిడి ప్రమిదలైన నేమి
స్నేహయుతములైన చాలు
జీవితాల వెల్గించును. ॥విన్నా॥

**వాయుగానం :**

తారలార దివ్వియలారా !
ఈరీతిగ అనుకోకండీ
మీ రూపులు వేరుగ నున్నా
మీ ఆత్మలు ఒకటేనండీ !

ఆకాశంలోని నలుపే అమావాస్య.
చుక్కలే నేలకు దిగివచ్చిన దివ్వెలు.

ఆకాశమె అమావాస్య
చుక్కలే దివ్వియలూ
ఆకృతులే వేరువేరు
ఆత్మమాత్ర మొకటే.
తారలారా !
దివ్వియలారా !

ప్రియుడు :

ఎంతసేపని దివ్వె లిటుల వెలిగింతువే
ఇకనైన దరిజేరవే దీప సుందరీ ! ॥ఎం॥

నీ నవ్వుతో జగతి నిండు దివ్వెలు వెల్గ
మట్టి దీపాలేల ముట్టింతువో బేల ! ॥ఎం॥

చిరువేడి వెల్గులో చెమరించి పోయితివి
మేడపై ఒకకొంత మేను వాల్చుము కాంత ! ॥ఎం॥

నడిరేయి దాటె ఇంకను దివ్వెలేలా
మనసులో వెల్గె యౌవన దీపమాల ॥ఎం॥



వాయుగానం :

సం[క్రాంతి శుభోదయ వేళ
హే
మంత రమాజీవన హేల.

మంచుముసుగు తెరలో శయ
నించిన తూరుపు రాగిణి
కాంచనాంగముల సూర్య క
రాంచలములు చంచలించె ॥సం॥

సెనగపూవు చిన్నది ప
చ్చని పైటను సవరించెను,
గుమ్మడిపూ ము త్తైదువ
గుండెనిండుగా నవ్వెను. ॥సం॥

బంతిపూవుటింతి వలపు
దొంతర లెత్తగ ఆడెను.
సేవంతీ సీమంతిని
భావగీతములు పాడెను ॥సం॥

* * *

[ఉదయకాల సంగీతం]

మూర్తి :

తొలిసందె వోలె త
ళుక్కులు జిల్కెడు కపోల
ఫలకాలపై నీలి
యలకాళి తొలు కాడ;
నిదుర కౌగిట నున్న
మదవతీ లెమ్మ్మ
ఎదలోన క్రొందలపు
లెగజిమ్మ్మ రమ్మ్మ.

*           *           *

కాసంత కదలి ఇం
కను కనుల్ మూసెదవు
చిరుమోవి పరదాల
దరహాస మాపెదవు .
తెలిసెపో నీ నిదుర చెలువా !
ఇక నన్ను గికురించగలవా !

లక్ష్మి :

సరసాలు చాలించుమోయీ !
నా మధు
స్వప్న భాండము తొణకెనోయీ !

కలలోన నీవు వె
న్నెలరాజు వైనావు.
నేను తారగ మారినాను;
నీగుండె
పైన వలపులు నూరినాను.

మూర్తి :

కలకరిగిన మాత్రమ్మున
కలవరమేలా బేలా!
కలలోపలి నెలరాయడు
నిలిచెగదా నీ మ్రోల

లక్ష్మి :

ఐన నిదుర లేపునంత
అవసర మేమోయీ?
క్రమ్మర లభియించున ఆ
కలలోపలి హాయి.

మూర్తి :

కలలకే మెన్నయిన
కనవచ్చు నింతీ!
మరల నేతెంచునా
మకరసంక్రాంతి.

లక్ష్మి :

ఈనాడె సంక్రాంతి
యమా నా ప్రియతమా!
కలల బరువున నేను
మరచినాను సుమా!

మూర్తి :

కలలోన మునిగి సం
క్రాంతినే మరచితివి
సంక్రాంతి సంబ్రాన
సఖుని మరచెదవేమొ?
లెమ్మా సుహాసినీ
లీలా సుభాషిణీ.

లత :

బలేబలే మా వదినగారూ !
పానుపైన దిగినారు కారూ
పానుపైన దిగినారు కారూ

ఎందుకు దిగవలె నంటూ
రా
ణీగారలు మాయింటూ.

అన్నయగారూ మీ రెండులకో
అపుడే మేల్కొన్నారూ?
పాపం వదినను నిద్దుర లేపి
పరిహాసము లాడేరు.

లక్ష్మి :

రాణీనైనా దాసీనైనా
మీ నాలుక చలువేలే
అన్నాచెల్లెండ్రిద్దరికీ ఎ
ల్లప్పుడు పరిహాసాలే.

లత :

వదినగారు మీ అభివందనాల
నిదో స్వీకరించెదను.
కదలిరండు రంగవల్లులిడ మీ
కిదో మోకరించెదను.

* * *

వాయుగానం :

తెలుగువాకిళ్ళ నేదెస విలోకించినను
కలయంపిజల్లు కన్నెలు కానుపించేరు.
సిగలలో బంతులను చేమంతులను నిల్పి
జలతారుటంచు వల్వలు సొగసుగా దాల్చి;

నెలతలీ సంక్రాంతి తెలుగుపండుగ నాడు
నడయాడు గొబ్బిదేవతలె యనిపించేరు.

**లత :**

రంగురంగుల మేలి
రంగవల్లుల నడుమ
సింగార మొలికించు
శ్రీదేవి మావదిన !
ఈవంక తిలకించవమ్మా
నీపాలి
శ్రీ విష్ణుమూర్తి కలడమ్మా.
తోటి ముత్తైదువల
తో గూడి గొబ్బిళ్ళ
పాటలను పాడుకుందామా
ఓ వదిన
ఆటలను ఆడుకుందామా ?

**లక్ష్మి :**

చిన్నారి మరదలా !
శ్రీ విష్ణు విట నుండ
పాటలను పాడలేనమ్మా !
ఆటలను ఆడలేనమ్మా !

మూర్తి :

శ్రీదేవి యింగితము
బోధపడి విష్ణువిదొ
అంగణమ్మును వీడనెంచె
పాటలకు
అవకాశ మీయగా నెంచె!

లత :

సిగ్గరివదినా సింగారి వదినా
ముగ్గులపై మనసొగ్గిన వదినా!
శ్రీ విష్ణుమూర్తి నిష్క్రమించె నిక
చూతువేమి ఒక గీతం పాడక.

* * *

బృందగానం :

గొబ్బిళ్ళో గొబ్బిళ్ళో

లక్ష్మి :

"కొలనిలోపలికి గొబ్బిళ్ళో !
యదు
కుల స్వామికిని గొబ్బిళ్ళో!
కొండ గొడుగుగా గోవులగాచిన
కొండిక శిశువుకు గొబ్బిళ్ళో!

దుండగంపు దైత్యుల కెల్లను కల
గుండు గండనికి గొబ్బిళ్ళో !
దండివైరులను తరిమిన వైరుల
గుండె దిగులునకు గొబ్బిళ్ళో !
వెండి పైడియగు వెంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్ళో"

**బృందగానం :**

గొబ్బిళ్ళో ! గొబ్బిళ్ళో !!

**లత :**

చూచితిర ఓయమ్మలారా
మా వదిన
చోద్యంపుపాట విన్నార ?
మాధవుడు లేనిదే
మన లేదు మాయింట !
గొబ్బిళ్ళ పాటలో
గూడ మాధవుడంట ॥చూచి॥

**లక్ష్మి :**

అమ్మలారా మీరు నమ్మబోకండీ
ఎగతాళి మా మరదలికి సహజమండీ.
ఆమె అన్నయ్య ఈ
యవసరమ్మున లేదు

గాని అన్నిట యీామె
కతడు తోబుట్టువే.

లత :

మావదిన వర్ణనలలో వాసిగాంచినది
తెలియ దీవిషయమ్ము నెలతలారా ప్మికు.
మావదిన అలుక మటుమాయమై పోతేను
చదువు నింకొకపాట సంక్రాంతిపూట.

బృందగానం :

గొబ్బియల్లో ! గొబ్బియల్లో !!

లక్ష్మి :

"చందమామ ! చందమామ !
ఓ చందమామ ! ఓ చందమామ !!
చందమామకు పిల్లా లెందరు?
నీలాగిరి కన్యాలందరు
నీలాగిరి కన్యాలకు నిత్యమల్లెతోట !
నిత్యమల్లెతోటలోన మంచినీళ్ళ బావులంట
మంచినీళ్ళ బావులకు మల్లెల్లతాడు !
మల్లెల్ల తాడునకూ గిల్లకల్ల చెంబూ."

బృందగానం :

గొబ్బియల్లో....గొబ్బియల్లో....

వాయుగానం :

గొబ్బిపాటల కోలాహలము
కోడిపుంజుల ఘోరావేశము
గంగెద్దుల మెడగంటల నాదము
బాలబాలికల ప్రగాఢ మోదము
తెలుగుటూళ్ళలో ప్రతిఫలించెను
తెలుగు నేల సంక్రాంతి మించెను.

* * *

గంగెద్దుల వాడు :

డూఁ డూఁ బసవన్నా !
డూఁ డూఁ బసవన్నా !
అయ్యగారికీ దండం పెట్టు
అమ్మగారికీ దండం పెట్టు
పట్టుశాలువలు పెడుతారు
పైడిముువ్వలను కడుతారు.
డూఁ డూఁ బసవన్నా !
డూఁ డూఁ బసవన్నా !
శివుని మాటలకు శిరసాడించీ
పార్వతి మురియగ పరువులు దీసీ
వెండికొండపై వెలసిన బసవా !
దండిదేవరను దాల్చిన బసవా !

డూ౯ డూ౯ బసవన్నా !
డూ౯ డూ౯ బసవన్నా !
ముందుకాళ్ళతో మోకరించరా
వెనుక కాళ్ళపై నిలిచియుండరా
దొరగా రొసగే జరీవస్త్రముల
బిరాన మూపున ధరించరా.

లత :

దండిదేవరను దాల్చిన బసవా!
దయతో ఆటను తగ్గించవయా
మా వదినగారు మా మంచివారు
పట్టువస్త్రమును బహూకరింతురు.

లక్ష్మి :

ఓ బసవయ్యా! ఓ బసవయ్యా!
ఒక్క నిమిషమే నిల్చోవయ్యా!
మా మరదలి అన్నయ్యగారి కా
శ్మీరు శాలువను మీ కొసంగెదను.

మూర్తి :

ఇంకొక నిముష మ్మో బసవయ్యా!
ఎట్లాగయినా నిల్చొంటే నా
చెల్లెలి వదినకు తల్లి గారిడిన
పట్టుచీర నే బహూకరింతును.

గంగెద్దుల వాడు :

డూఁ డూఁ బసవన్నా !
దొరగారిది మా దొడ్డచేయిరా
అమ్మగారిదీ అమృతహస్తమే
ధనధాన్యాలతో ఘనముగ మీరూ
కలకాలము వర్ధిల్లాలె.
బి
చ్చగాళ్ల కడుపులు నిండాలె.

వాయుగానం :

సంక్రాంతి శుభోదయ వేళ
హే
మంత రమా జీవనహేల !



[గోపికలు, గోపకులు కృష్ణుని జననోత్సవం చేసుకుంటుంటారు]

*బృందగీతి :*

కన్నయ్య జన్మించె విన్నారటే
వెన్నుడే వ్రేపల్లె వెలిశాడటే

*గోపిక 1*

వానకాలపు మబ్బువంటి దేహము వాడు
మెరుపు తీగెలవంటి మేలినవ్వుల వాడు

*గోపిక 2*

మల్లె మొగ్గలవంటి పల్లు వరుసల వాడు
కళ్ళలో తమ్మి పూవ్వల్లు విరిసిన వాడు

*బృంద గీతి :*

కన్నయ్య జన్మించె విన్నారటే
వెన్నుడే వ్రేపల్లె వెలిశాడటే

*గోపకుడు 1*

తల్లి గోవులు పాల జల్లులను కురిసినవి
పిల్ల లేగలు పొంగి క్రేళ్ళురికి మసలినవి
కోడెగిత్తలు మూపు జాడించి యెగిసినవి
చిన్ని మా కన్నయ్య కన్ను విప్పినవేళ
అందాల మా కృష్ణు డవతరించినవేళ

గోపకుడు 2

బాలచంద్రుని గన్న పాలసంద్రమువోలె
భానుమూర్తిని గన్న పద్మాకరమువోలె
అందాల మా కృష్ణు డవతరించినవేళ
గోకుల మ్మువ్పొంగె మా కులము వెల్గొందె.

బృంద గీతి :

కన్నయ్య జన్మించె విన్నారటే
వెన్నుడే వ్రేపల్లె వెలిశాడటే

[గోపికలంతా కలిసి కృష్ణుణ్ణి చూడడానికి వెళుతారు.]

గోపిక 1

ఎన్నియుగముల పున్నెమే యశోదా నీవు
నీలాల సరిదూగు బాలుణ్ణి కన్నావు

గోపిక 2

ఎన్నినోముల పంటయే యశోదా నీవు
బంగారుతో దూగు పాపణ్ణి కన్నావు

గోపిక 3

ఏమిరా కృష్ణయ్య ఎందు కా చిరునవ్వు
దొంగవలె మా మనసు దోచుకొంటున్నావు.

*గోపిక 1*

ఏమమ్మ మీవాడు సామాన్యుడా కాడు
వెన్న లందించ నా వ్రేలు గొరికెను చూడు.

*గోపిక 2*

ఓ యశోదమ్మ ! నీదే యదృష్టము సుమ్మ
నీ కృష్ణు డొకనాడు లోకాల కగు రేడు.

*గోపిక 3*

పోయివచ్చెద మమ్మ ఓ యశోదాదేవి
త్రేతలకు మీవాడు వేలుపే యవుతాడు.

*యశోద :*

మీ దీవెనలవల్ల మా చిన్ని కన్నయ్య
వర్థిల్లనీ వేయి వత్సరమ్ములపాటు.
మీ కోరికలు పండి మా కృష్ణు డొకనాడు
గోకుల పయోరాశి రాకేందు డవుతాడు.

[గోపికలు శ్రీకృష్ణుని దుడుకు చేష్టలను యశోదతో చెబుతారు.]

చిన్ని కృష్ణుం డెంత చిలిపివాడమ్మా ?
ఇంతింత యనరాని వింత చేష్టలు జేసె.

*యశోద :*

కన్నులైనా తెరువగాలేని మా ముద్దు
కన్నయ్య మీ కెగ్గు కల్గించినాడా ?

గోపిక 1

లేదో యశోదమ్మ నీ దాపునే యున్న
నల్లనయ్యను తెలుసుకొన్న తెల్లమ్మగును.

యశోద :

ఏమిరా కృష్ణయ్య ! ఈ గోపికల యిండ్ల
ఏమేమి జేసితివో యెరిగించరా తండ్రి.

కృష్ణుడు :

ఓయమ్మ నీతోడు నాయన్న తోడుగా,
ఈ గోపికల యిండ్లలో నాకు పనియేమి ?

గోపిక 2

అబ్బ ! యెంతటి అమాయకునివలె పల్కేవు
నిన్ననే మా యింట వెన్న దొంగిల లేద ?

యశోద :

ఏమిరా కృష్ణయ్య ఈ మాట నిజమేన ?

కృష్ణుడు :

లేదమ్మ నే నెరుగలేను ఈ విషయమ్ము.

గోపిక 3

నా కొడుకు నా కోడ లేకాంతమున నుండ
పా మొకటి పడవైచి పారిపోవగ లేద ?

యశోద :

ఏమిరా కృష్ణయ్యా ఈ మాట నిజమేన ?

కృష్ణుడు :

లేదమ్మా నే నెరుగలేను ఈ విషయమ్మూ.

గోపికలు :

మా యింటి మగవారు మందకేగిన వెన్క
నాపైనబడ నీకు నవ్వులాటైనదా ?

యశోద :

ఏమిరా కృష్ణయ్యా ఈ మాట నిజమేన ?

కృష్ణుడు :

లేదమ్మా నే నెరుగలేను ఈ విషయమ్మూ.

యశోద :

ఓ యమ్మలార! ఈ సారి మన్నించండి
మా వాని యల్లరిని మాన్పింతు చూడండి.
కన్నడూ! నీతోడ నెన్నిమారులు పొరుగు
వాండ్ల యిండ్లకు వెళ్ళవద్దంటు చెప్పితిని.
మళ్ళి మళ్ళీ యిట్టి అల్లరులు చేసేవ
కవ్వంపుత్రాడుతో కట్టివేతును చూడు.

కృష్ణుడు :

నను చూచి కండ్లుమండెనో యేమొ వీరలకు
లేని నిందలను నాపైన వేస్తున్నారు.
ఓ యమ్మ! నీ తోడు నా యన్న తోడుగా
అన్నె మెరుగగలేని పిన్నవాడను నేను,

* * *

రాధ : [ యమునాతీరంలో విరహార్తయై ]

యమునానదీ సైకతములలో నీ కాలి
చిన్నె లీ నడిజాము చెరిగిపోలేదయ్యా.
ఎందు దాగున్నావో అందాలకృష్ణ
ఆరి పోలేదోయి నా ప్రణయతృష్ణ.

కను రెప్ప లల్ల నల్లన మూసితినో లేదో
మనసు లోపలి బాధ మాటుమణగెనో లేదో
చల్ల చల్లగ వింటి నీ వేణుగానమ్ము
జల్లు మనియెను గుండె తల్లడిలె ప్రాణమ్ము.

ఎందు దాగున్నావో బృందావిహారీ
ఏదీ నీ మురళి వాయింపు మొకసారి.

కృష్ణుడు : [ రాధను అన్వేషిస్తూ ]

రాధికా! రాధికా!!

నా వేణూదయగీతికా
నా గానామృతవీచికా!

కాళిందీ సైకతముల మాటున
బృందావన తరుబృందం చాటున
ఎంత వెదికినా లేదిక
ఇభయామిని నా రాధిక.

[దూరంనుండి]

రాధ :

రాధనురా కృష్ణా.
గాయపడిన వలపుగుండె
బాధనురా కృష్ణా!

ఎంతో దవ్వుల నీ మురళీ రవమ్ము విన్పించెను.
గొంతులోన నేవేవో
క్రొత్తపాట లుదయించెను.

[ఇంతలో కృష్ణుని మురళీగానం విన్పిస్తుంది.
గోపికలు పరవశలై ప్రవేశిస్తారు]

వాయించకురా కృష్ణా!
తీయని మురళీ గీతం

పలికించకురా కృష్ణా !
వలపురేపు సంగీతం.

రాధ :

హృదయపీఠి నీకొరకై
పదిల పరచితిని రారా

గోపిక 1

బాహులతలు నీకొరకై
ప్రాకివచ్చెరా కృష్ణా

గోపిక 2

నీకొరకై కన్నులు వె
న్నెల కురిసెనురా కృష్ణా

గోపిక 3

నీకొరకై మోడు బ్రతుకు
రేకులెత్తెరా కృష్ణా

రాధ :

రాధనురా కృష్ణా !
రాధనురా కృష్ణా !

గోపికలు :

గోపికలము కృష్ణా !
గోపికలము కృష్ణా !

[మళ్ళీ వేణుగీతి మెల్లగా విన్పిస్తుంది]

రాధ :

అదిగదిగో వేణుపాణి
మృదుల గీతికారావం

గోపిక 1

అల్లదిగో వన్నెకాని
చల్లని కనక దుకూలం

రాధ :

ఇదో యిదో నా వల్లభు
డేతెంచెను చూడండీ !

గోపిక 2

ఏడి యేడి ప్రాణసఖుం
డింతలోనె మాయమాయె.

అందరు :

కృష్ణా—కృష్ణా—కృష్ణా !

గోపిక 1

తొలిసిగ్గు బరువుతో తలవంచుకొనిసాగ
చెలియరో నిలుమంచు చేలాంచలము లాగి
మరలి చూచినయంత మాయమైనా వేల
తరుణులను వేధించ తగునురా గోపాల?

గోపిక 2

అధరమాసించి నన్నాలింగనము సేయ
పరవశమ్మై కన్ను లరమూసి తెరచితిని.
మురువు లొల్కెడునీదు మోవి కన్పడదాయె
మోవి కన్పడదాయె మోము కన్పడదాయె.

గోపిక 3

తలపైన నెమిలి కుచ్చులు నాట్య మొనరింప
చేతిలో మధుర వంశీనాళము దలిర్ప
కనుసైగ జేయగా కౌగిలించితి, నీదు
తనువు మాయమ్మాయె తరువుమాత్రము నిల్చె.

గోపికలు :

బేలల పరీక్షింతు వేలనోయీ కృష్ణ!
పూలపై రాలవర్షాలు తగునా కృష్ణ!

గోపిక 1

ఓ మేఘమాలికా! మా మేఘవర్ణుండు
నీ మేలిముసుగులో నిల్చెనో యేమొ!

గోపిక 2

ఓ మాధవీలతా! మా మాధవస్వామి
నీమాటు గూర్చుండె నేమొ తెల్పగదే!

గోపిక 3

మల్లీమతల్లికా! మాటాడవెందుకే?
నల్లనయ్యను జూచినావటే యీపూట!

గోపిక 1

ఓపొన్న కన్నియా! కోపగించక తెల్ప
వే ప్రాణనాథుండు వెళ్ళెనా యీ బాట?

గోపికలు :

తరులార గిరులార దయతోడ తెల్పుడీ,
సరసీరుహాక్షుణ్ణి దరిసించితిర మీరు?
గోపాల రావయ్య
గోవింద రావయ్య
మాపాలి యపర మ
న్మథమూర్తి రావయ్య.
కన్ను చాటులు చాలు
కౌగిలింతల నేలు.
విరహ మోర్వగలేము
మరణమైనా మేలు.

రాధ :

రాధనురా కృష్ణా!
రాధనురా కృష్ణా!

కలకాలం నిలుచు ప్రేమ
గాథనురా కృష్ణా !

గోపికలు :

గోపికలము కృష్ణా !
గోపికలము కృష్ణా !

[రాధ, గోపికలు మదనపీడితలై మూర్ఛిల్లుతారు]

కృష్ణుడు :

తే లెమ్మో రాధికా !
రా రమ్మో రాధికా !
ప్రణయ కింకిణులు మ్రోసే
అమృత నాట్య వేదికా !
రారండీ నా వరాల గోపికలారా !
ఆరిపోని చిర స్నేహ దీపికలారా !
మన ప్రేమలు పూలగుండె
లను లేచు పరిమళమ్ములు.
ఆకార విరహితమ్ములు
అనుభవైక వేద్యమ్ములు.

అందరు :

కృష్ణా!...కృష్ణా!...కృష్ణా!

[పోతన భాగవతంలోని దశమ స్కంధానికి కృతజ్ఞతతో]

[సుత్తె మ్రోత దూరాన వినిపిస్తుంటుంది. నేపథ్యంలో
ఒక కంఠం నెమ్మదిగా వినిపిస్తుంటుంది.]

*నేపథ్య కంఠం :*

సంసార కాసార
జంబాలమును మీరి
హింసా రిరంసా ర
హిత జగమ్మును గోరి;

ఏకాంతమున అజం
తా కందరములందు
ఏ పాపమంటని శి
లా ఫాలముల యందు;

ఎన్ని నాళ్ళాయె నీ
కన్నులను నిల్పి ?
ఏ ఊర్వశిని విలో
కించేవు శిల్పి !

[సుత్తెమ్రోత క్రమంగా సన్నగిల్లుతుంది]

*శిల్పి :* [పరిశ్రాంతుడై అర్ధనిద్రావస్థలో]

అద్దాలవంటి శిల
లవ్యక్తముగ దోచె.

కనులలో మసక చీ
కటుల తరగలు లేచె.

నా అజంతాసీమ
నాకరూపము దాల్చె.
నా శైలబాల ప్రా
ణము వోసికొని నిల్చె.

భ్రాంతియో నాలోని
ప్రణయ సమ్మోహమో?
స్వప్నమో నాలోని
సౌందర్య దాహమో ?

శైలబాల : [అందెల చప్పుడుతో క్రిందికి దిగుతూ]
రంభాది అప్సరో
బింబాధరలతోడ
జంభారిమ్రోల సం
రంభించి యాటాడ;
ఎవరో నను మంత్రించి
భువికి రప్పించేరు.
ఎవరో దేవతకు మా
నవత కల్పించేరు.

[ఉల్లాస సముల్లసితుడై]
ఓ అజంతా సుందరీ !
ఓ దిగంత మనోహారీ !

నాలోని భావ సం
ధ్యా శోణిమలు మాపి
నిండు పున్నమల నం
దించిన విభావరీ !

ఓ అజంతా సుందరీ !
ఓ దిగంత మనోహారీ !

నీ మేఖలా కింకి
ణీ మంజుల ధ్వనులు
నా శిలామయ జీవ
నమున కుప సేచనలు.

నిలువెల్ల కనులతో
నిన్ను చూచెదనన్న
సురనాథుడను గాను
నరమాత్రుడను నేను.

మనసార నిన్ను వ
ర్ణన జేతునన్న కవి

రాజు నైనను గాను
రమణి ! శిల్పిని నేను !

శైలబాల :

శిలలలో విమల చం
చలలు నిలిపిన శిల్పి !
రాలలో నందన వ
నాలు నాటిన శిల్పి !

సామాన్యుడవు గావు
సాక్షాద్విరించీ!
అర్చింతు మిమ్ము ని
త్యము శిరము వంచి.

శిల్పి :

అర్చనలు నాకేల
అప్సరో బాల !
నీ చరణ దాసుడను
గానకే వేల !

ఎన్ని యుగములు దాటె
నిన్ను గాంచగ నెంచి.
ఈనాడు రవళించె
నే; జీవన విపంచి.

నా చేతిలోని ఉలి
నీ అందియల రవళి
కోసరము గాదశే
గుహాల ప్రమోగించినది.

ఓ చంద్రబింబాస్య !
నా చేతికుంచె నీ
చిరునవ్వు కిరణాల
చిత్రించ నెంచినది.

ప్రతి శిలాప్రతిమతో
భాషించి చూచితిని.
ప్రతిభాషణలు రాక
ప్రతిమనై పోయితిని.

ఎటుచూచినా దివ్య
నటనాలయమ్ములే
కాని నూపుర ఝణ
త్కారాలు వినరావు.

ఎందేగినా నాట్య
సుందరుల భంగిమలె
కాని యౌవన వికచ
కాంతులే కనరావు.

నా కళలు నేటికి ప
రాకాష్ఠ నెందినవి.
నా రాతిబ్రతుకు మం
దారాలు పూచినది.

లేకున్న నీవంటి
నాక బింబైకవతి
తొాణకని మనోజ్ఞ యౌ
వన సుధాభాండమ్ము
మోసికొని వీతెంచునా ?
నాగుండె
దోచుకొన నేతెంచునా?

శైలబాల : [భక్తి భావముతో]

నన్ను లాస్య దాస్య బంధ
నాలనుండి విడిపించిన
నాకు శాశ్వతమైన్న క
ళాం కాంతుల నందించిన
నాకు నవ్యజీవన దా
నము జేసిన ఆచార్యా !
దాసిచేయు పరిచర్యల
దయతో సెలవీవయ్యా!

శిల్పి :

దాసివటే నీవు మత్తె
కాశినినీ! నాముందు.
ఈ బేలతనపు మాటల
కేనేమనియందు.

అంబరగంగా ఫేన స
మంచితమ్ము నీదేహము.
సందర్శన మాత్రమ్మున
కందిపోవుగాదె చెలీ !

పరిచర్యల జేయుటకై
ప్రభవించితివా దేవీ!
ప్రణయ పరీరంభణకై
జనన మొందినావుగాని.

నీమృణాళ కోమలాంగు
శీ మృదుల స్పర్శల నా
ప్రత్యంగము కిన్నెరలను
పల్కించు విధాన మ్రోగు.

నీ పరిలంబిత కుంతల
నీరదాల ముసుగు దీసి,
నాటిన వెన్నెల చూపులు
నా పాలి మరుని తూపులు.

సిగ్గుబరువుచేత ఏల
చెమరించెదవో రాణీ!
కచభారముచేత నీవు
కంపించగవలె గానీ!

తరళిత చేలాంచలమ్ము
సరిచేతును రావే!
సడలిన వేణీబంధము
ముడివేతును రావే!

శైలబాల:

కళాదూరులైన వారు
ప్రలాపించు వచనమ్ములు
పూజ్యులైన మీరు పల్క
బూనుట ధర్మమ్మేనా?

విషయ సుఖమ్ముల కందని
విశ్వప్రేమ తపస్వులు
శిల్పాచార్యుల కింతటి
అల్ప కామనలు తగునా?

శిల్పి:

సౌందర్యాన్వేషణలో
అంధుడనై పోయినాను.

ఏది ధర్మమో పరిశీ
లించలేను చంచలాంగి!

ధర్మవిచారణ లెందుకు
తరుణీ యీతరుణమ్మున?
మర్మవేదనలు తీరును
మధుర పరిష్వంగమ్మున.

శైలబాల :

చాలించుడు ఆచార్యా
సల్లాపము లికనైనా.
తన సృష్టిని మోహించే
తండ్రి గలడె యెందైనా ?

శిల్పి :

నా సృష్టివా నీవు
ఓ సుందరీమణీ !
ఆకసము దిగినట్టి
అమర కాంతవుగాని.

మది చెదరిపోయె నీ
మాటలుండగనిమ్మ
ఇదిగో నీజిలుగు ప
య్యెదను మీటగనిమ్ము.

[స్వప్నావస్థలోవున్న శిల్పి సంరంభంతో ముందుకు వంగు
తాడు. తలకు శిల బలంగా తగులుతుంది. కలకరిగి
పోతుంది. అమరకాంత అదృశ్యమవుతుంది.]

*శిల్పి :*

మాయమైపోయెనా
నా అమర భామిని ;
శిలమాత్రమే నిలిచె
విలపింతు నేమని ?

ఓ అజంతా సుందరీ !
ఓ దిగంతమనోహరీ !

[గొంతెత్తి పిలుస్తుంటాడు]

*నేపథ్య కంఠం :*

కలలోన నీ శిల్ప
ఖండమే గంధర్వ
కాంతగా కనుపించెనన్నా !
మోహా వి
భ్రాంతులను కల్గించెనన్నా !
నిగ్రహము లేకున్న
నీ కళార్చన సున్న.
సంయోగమే లేని
సౌందర్యమే మిన్న.
సృష్టియే తనకు సం
తుష్టిని ప్రసాదించు

ప్రతిఫలము నాశించి
బ్రతుకడు కళాజీవి.

ఇది జగత్సత్యమో యన్నా !
మృదుకళా
హృదయ మొకటే నిత్యమన్నా !

శిల్పి : [పశ్చాత్తాపంతో]

ఓ శిలాబాలికా !
నా కళాడోలికా !
అమలగిరి కంఠాల
అమ్లాన మాలికా !

రాలలో గంధర్వ
రసజగత్తులు నాటి
సందర్శనముతోడ
సంతృప్తి నందెదను.

విశ్వసుందరతా గ
వేషణమ్మున కళను
కర్పూర కళికగా
అర్పణము చేసెదను.

ఓ శిలాబాలికా !
నా కళాడోలికా !
అమలగిరి కంఠాల
అమ్లానమాలికా !



పక్షులు :

[ పాట ]

విశ్వమనగా వెలుగు నీడల కలయిక
పెనగులాడును మనిషి దీనిని తెలియక ॥విశ్వ॥

మింటమెరిచీ మిసిమి కురిసే మినుకు లోకవంక
మీటతో వెలిగేటి దివ్వెల కోటియొకవంక ॥విశ్వ॥

పాలపెదవుల పూలపాపల పంచలోపలనే
మరతుపాకుల కరకు బాకుల మాటవిన్పించు ॥విశ్వ॥

చేదుచిలికే జీవితమ్ములు స్వాదుతానిలయమ్ములు
మధువు లొలికే మాటబొమ్మల మాటు నాగఫణమ్ములు
॥విశ్వ॥

అపుడె చల్లని చేదబావి అప్పుడేయది ఎండమావి
క్షణము ముందే పెనుయెడారి కనులు దెరచిన యినుపదారి
॥విశ్వ॥

మానవుడు :

నేను మానవుణ్ని
నేను విజయుణ్ని.
నే పూన్చిన నాగరకతా రథానికి
యంత్రం ఒక కపిధ్వజం.
ఉక్కును ఉప్పులా కరగబోసి

ఇనుమును జనుములా సాగదీసి
కుమ్మరి పురుగును చేరదీసి
తుమ్మెదగా తయారు చేసి
లోకాని కందించాను.
నాకాన్ని నేలకు దించాను.

కాలినడకతో కాశీమజిలీలు చేయడం
గాలిలోని గ్రద్దల్ని చూచి ముఖం తేలవేయడం
అతివృష్టి నాపడానికి అనావృష్టి మాపడానికి
చిల్లర దేవతలకు గుల్లెడు టెంకాయలు కొట్టడం
బాబోయ్ నేటితో తీరింది.
యంత్రం నా అర్ధాంగముగా మారింది.
సముద్ర గర్భంలో చదరంగ మాడుతాను
ఆకాశంలో ఈదుతూ మబ్బుల్ని
అరచేతిలో ఆడిస్తాను.
అమెరికాలో కూర్చొని
ఆంధ్రదేశంలో కన్పిస్తాను.
ఏమూలనో 'హలో' యని
విశ్వం సొంతం విన్పిస్తాను.

చిరకాలం మేధాసాగర మథనంచేసి నేను
అందుకొన్న అమృతానికి
యంత్రం నామాంతరం.

పాన్పులోంచి కదలకుండా
ప్రపంచాన్ని చుట్టివచ్చి
చిచ్చుపెట్టె లేకుండా
సిగరెట్టును ముట్టించి;
చేతికి తడి లేకుండా
చిత్రంగా భోంచేసి
కాలికి మన్నంటకుండా
కాశ్మీరం తిరగేసి;
ఎంతో సుఖపడ్డా నీ
యంత్రం పుణ్యాన.

యంత్రం నను లాలించే ఆత్మసఖి
యంత్రం నమూగించే అపరశిఖి
యంత్రం నా బానసీడు
యంత్రం నా బానిసీడు.

*యంత్రం :*

ఆ గొంతుక ఎవరిదీ
అటనున్నది ఎవరదీ ?
ఓహోహో మనిషి.
దీపశిఖవు కాదు సుమా వొత్తినుసి.

నేను నీకు బానసీడనా ?
నేను నీకు బానిసీడనా ?

సఖినా——శిఖినా——
ఔనొకమాదిరిగా శిఖినే.

నాటిమాట——నీ లోపల
మోటుతనం ఆటవికత
మంచుగడ్డలై పేరిననాడు;
భ్రాంతులతో భయాలతో
నీ గుండెల దవడలు వజవజ వణకిన నాడు;
నీకు వేడికల్గించిన శిఖినే.

మొండివడ్డ నీ మేధను
ముట్టి వాడి కల్గించిన శిఖినే.
అపుడే నాకందకుండ పోతివా ?
అపుడే నాశక్తి మరచిపోతివా ?

ఆటంబాంబు నాహృదయము
నందు పీటవేసుకున్న ప్రియమిత్రము.

ట్రాక్టర్లు ఆటమిక్ రియాక్టర్లు
హెలికాప్టర్లు నాకు
రక్త బంధువులు.

ఫిరంగులు నా పురోగతికి
సరంగులు.
పంచభూతాలు నా ముంగిట్లో
పంజరంలోని చిలుకలు.

మనిషీ !

దోర్బలం ఉన్న దుర్బలుడవు నీవు
జుట్టు దొరికితే చాలు జెట్టినంటావు.
పిడుగును వజ్రాయుధ మనుకొని
గడగడ వణకే వాడవు
ఉరిమితే 'అర్జునా' యని
ఉలిక్కిపడి అరచే వాడవు.

చంద్రగ్రహణ కాలంలో నరాల్ని కొరికే
చన్నీళ్ళలో మునిగే వాడవు.
ఇంద్ర ధనుస్సునేమో అనుకొని
ఇట్టింకులు పోయేవాడవు.
గతస్థితి నెమరువేసుకో
కళ్ళ పొరలు తీసివేసుకో.

నీవు పంచభూతాలను
దేవుళ్ళుగా దయ్యాలుగా
పూజించిన రోజుల్లో
పుట్టాను—జ్ఞాపకముందా ?

కళ్ళూ కాళ్ళూ కడుక్కొనే
చల్లని నీళ్ళను మథించి
సలసల్రాగే విద్యు
చ్ఛక్తిని పలికించాను.

పిసినిగొట్టు పుడమి కూడ
బెట్టుకున్న ధనరాశిని
పసిగట్టి లోకం ముందు
బట్టబయలు చేశాను.
చురచురమండే సూర్యుని
కిరణాలను ప్రోగుచేసి
కూలీలకు బదులుగ అవ
లీలగ పని చేయించాను.
తిరుగుబాటు పుట్టుకతో
తెచ్చుకున్న పెనుగాడ్పును
బందీచేసి వలసినప్పుడు
మందులా వాడడం నేర్పాను.
శూన్యంలోని శబ్దాన్ని
చుంచుదువ్వి ఆప్యాయంగా
ఇంటింటికీ పంపించి
ఇలవేల్పుగా చేశాను.
అణువులో అనంతవిశ్వాన్ని చూపించాను.
అష్టదిగ్గజాలు లేవని నిరూపించాను.
మంత్రాలకు చింతకాయలు రాలవని
మరీ మరీ రుజువు చేశాను.
నిన్ను అభ్యర్థిగా నిలబెట్టి
ఎన్నిక తతంగం నేను జరిపాను.

మనిషికీ మర్కటానికీ ఉన్న
మార్జిణ్ణ చూపింది నేనే.
మనిషిని మనీషిగా మార్చిన
అనన్య శక్తిని నేనే.
నేను బొమ్మ చిట్లిస్తే లోకం
నిలువునా బూడిదై పోతుంది.
నేను నవ్వు చిలికిస్తే లోకం
జాను వెన్నెలలు కాస్తుంది.
నన్నెదిరించే గిరులను
సున్నంలా చిదిమి వేస్తాను.
నాకెదురయ్యే గ్రామాకుల
ఆకుల్లా నలిపి వేస్తాను.
పుట్టలను చిట్లగొడుతాను.
మిట్టలను చదును చేస్తాను.
రుద్రుడు నా తాండవానికి
రుగ్నాత్ముడు కావాలి.
ప్రకృతి నా పదఘట్టనకు
శకలాలై పోవాలి.
ఇదిగో కదిలాను నేను !
ఇదిగో కదిసాను నేను !

[యంత్రం కదలిన భయంకర ధ్వని వినిపిస్తుంది.
క్రమంగా ఆ ధ్వని సన్నగిల్లిపోతుంది. ఇంపైన సంగీతం వినిపిస్తుంది.]

పుష్పం :

[ పాట ]

ఎవరో నను పెంచు తోటమాలి
పువులపైన అతనికెంత జాలి ॥ఎవరో॥

నునుతీవియ పానుపు సవరించి
తలిరాకుల తలగడ లమరించి
మెలమెల్లగ మొలక తెమ్మె
రల వింజామరలు వీచి;
నన్ను కన్న కూతురుగా
కన్నుల నిల్పేరెవరో ॥ఎవరో॥

పాల వెన్నెలను కాచీ
పచ్చి మీగడను దీసీ
మంచుబిందువుల దూసీ
మౌక్తికహారము జేసీ;
నన్నలరించే మహాత్ము లెవరో
నను పలికించే కళాత్ములెవరో ॥ఎవరో॥

అతని కాలి సన్నలందు
ఆనంద సమాధి పొందగలనో
అతని వ్రేలి సందులందు
అలంకరణమై హసించగలనో.

[యంత్రం నడుస్తున్న చప్పుడు భయంకరంగా విన్పిస్తుంటుంది.]

పుష్పం : [పాట చివరి చరణం మధ్యలో గబాలున ఆపి]

అబ్బా! దారుణ ధ్వని. పాలకడలిలో హాలాహాలం అలజడి. భరించలేను. శ్రవణపుటాలు వ్రక్కలవుతున్నాయి. మనస్సులోని మధువు ఆవిరై పోతున్నది. అయ్యో! కాటుక కొండ కదలినట్టు, కాళిక బిత్రబిగిసినట్టు, కాళ మేఘానికి కాళ్ళు మొల్చినట్టు, ఆ భయంకర రూపాన్ని చూడలేను. అమ్మయ్యో! ఆ ఉక్కుకాళ్ళు నాదిక్కే నడుస్తున్నాయి. ఆ కబంధ హస్తాలు నావైపే వస్తున్నాయి. అదిగో!

యంత్రం :

కమ్మని తేనెకు గానుగ నూనెకు
మల్లెపూలకూ ముళ్ళపొదలకూ
తమ్మితీగకూ తుమ్మచెట్టుకూ
ఊరితోటకూ కారాటవికీ
తేడా చూడని తీవ్రశక్తినీ
తీవ్రశక్తినీ దీప్రశక్తినీ.

పుష్పం :

పంచప్రాణాలు అరచేతిలో ఉన్నవి. కనుమూసి
తెరిచేలోపుగా ఇనుపహస్తాల్లో నలిగిపోనున్నా
ను. నన్ను పెంచే తోటమాలీ! పేదపూల పాలిటి
వనమాలీ! పురుషోత్తమా! మానవోత్తమా!
రాతంద్రీ ! రావయ్యా ! రక్షించు ! !

మానవుడు :

భయపడకు సుమా నీ
ప్రక్కనే నిల్చున్నాను.
యంత్రం వేస్తున్న వెర్రితలలు
సాంతం గమనిస్తున్నాను.
భస్మాసుర వరంలాగా
పరిణమించిందీ యంత్రం.
పాలుబోసి పెంచుకున్న
పామైపోయిందీ యంత్రం.
యంత్రం! చాలింకా నీ ఆర్భాటం.
పేదపూలతోనా నీచెలగాటం.
నానాటికి నీలోపల
దానవత ముదురుతుంది.
ప్రతిక్షణం నీలోపల
పైశాచం ప్రబలుతుంది.

పుష్పం :

మానవోత్తమా! నీ మాటలు
మండే అగ్నిపై వృష్టి.
అవశ్యం మార్చాలి నీవు
యంత్రం పైశాచిక దృష్టి.

యంత్రానికి దయాగుణం హుళక్కి.
ప్రకృతిని చీల్చడమే దానిఫక్కి.
మానవ సమాజం నోరూరించి
అరచేతిలో స్వర్గం చూపించి
మృత్యువనే చీకటి గదిలో
మెడలుబట్టి నెట్టుతుంది యంత్రం.

*యంత్రం :*

చెవులకంటె కొమ్ములు వాడియైనట్టు
గ్రుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్టు
మనిషీ పువ్వా యేమో
గొణుగుతున్నా రసహ్యాంగా.
ఓ మనిషీ! నువ్వూ పువ్వూ కలిసి
మృత్యుకూపంలోకి తొంగి చూస్తున్నారు.
యంత్రాన్ని ఎదిర్చడం ఏటికి ఎదురీదడం.
యముని దున్నపోతు తోక
అందుకొనగ వ్రేలడం.
బెబ్బులి మీసాలు పెరికివేయ సాహసించడం.
పగులనున్న జ్వాలాముఖిపైన నిద్రపోవడం.
మేకపోతు గాంభీర్యం నీకెందుకు మనిషీ!
లేపకు నా తామస స్వరూపం
అవుతావు మసి.

మానవుడు :

నిన్ను నమ్మి ఇన్నినాళ్ళు
నిజంగా గడ్డితిన్నాను.
ప్రకృతిని కాదని నీకే
బ్రహ్మరథం పట్టాను.
నీవు చేసే వికృత సృష్టి
నీలాగే ఉత్తజడం.
సౌందర్యాన్ని అణగబట్టి
శస్త్ర చికిత్స చేయడం.
గడ్డిపోచలోని జీవ
కళ ఉందా నీసృష్టికి.
హంస ముక్కులోని న్యాయ
మలవడునా నీ దృష్టికి.
చంద్రునిలోని అమృతాన్ని గిలకొట్టే
శక్తి నీచేతికుందా.
శంపాలతల చిక్కబట్టే
చాకచక్యం నీకుందా.
ప్రాజెక్టులలో సెలయేళ్ళ
ప్రణయగానం విన్పిస్తుందా.
కాగితపు పూలల్లో నాసా
గ్రాసమైన పరిమళముందా.

విద్యుత్తాళ వృంతాలు
విసిరి విసిరి కొట్టేగాడ్పు
మలయాచల గంధవహం
మాదిరిగా ఉంటుందా.

పూవుముందు మోకరిల్లిపో
ప్రకృతిముందు శిరసు వంచుకో.

*యంత్రం :*

రక్త సంధ్యా వేదికా రు
ద్ర ప్రఖీకర డమరు ఘోషణ
ముందు దొమ్మరిడోలు పోలిక
ఉంది నీ సంభాషణ.

నీ సుమార్చన నీరసతకు నిదర్శనం
నాగరికతకు నీప్రవృత్తి వివర్తనం.
నీవు మళ్ళీ తోలుచీరెలు కట్టుకో
నీవు మళ్ళీ కాననంలో మెట్టుపో
అడవి మృగములతోడ వియ్యం జరుపుకో

నేను మాత్రం యథావిధిగా చరిస్తాను
కాకోళాన్ని కబళించి త్రేనుస్తాను
విషధరాలను అవలీలగా పిసికేస్తాను

బడబాగ్నిని జడలో ముడుచుకుంటాను
పిడుగులతో సరిగమలు నేర్చుకుంటాను

అగ్నిని జలపాతంలా దూకించి
జలంలో అగ్నిని ప్రాకించి
చంద్రబింబంలో అణుబాంబుల
ఫ్యాక్టరీలు తెరుస్తాను.
అంకుశ మెక్కడిది నాకు—ఐరావతాన్ని
పవిఘాతం లేదునాకు—పక్షీంద్రాన్ని
నా కాళ్ళక్రింది సమస్తాన్ని
నశ్యంలా నలిపేస్తాను
అహో ! క్షుద్ర జీవకోటి
సహించునా గమనధాటి.
సహించునా గమన ధాటి
అహో ! క్షుద్రజీవకోటి !

[యంత్రం కూతపెట్టి నడుస్తుంది. మానవుని హాహాకార ధ్వని. హృదయాలను దూసుకొని పోయే సన్ననికేక]

మానవుడు :

నా కర్పూరపుమొల్కను నలిపివేశాడు నిశాటుడు
నా వరాల రామచిల్కను నరికివేశాడు కిరాటుడు.
నా నెత్తురు యెదురు నడక నడుస్తుంది
నా నేత్రాలను తిమిరం తినేస్తుంది.
అయ్యో నాగరికతా !
అయ్యో యాంత్రికతా !

పాలుపోసిన జాలిగుండెను
హాలాహలంలో త్రోస్తావా ?

**పక్షులు :**

పాదరస భాండమ్ము పగిలిపోయినది
పట్టుకుందామన్న పారిపోయినది.

గడచిపోయిన దానికై తపించెదవేల
ఎడదనే కన్నీళ్ళ మడుగు చేసెద వేల
విలాపించి ఫలమ్మేమి మానవా
వెలుగుబాట ముందుముందు కానవా. ॥విలా॥

యంత్రం ఒక మదపుటేనుగై తే
నీవు మావటీడవు కావాలి
యంత్రం ఒక వారిధియైపోతే
నీవొక వారధియై నిల్వాలి ॥విలా॥

అణుగోళమ్ములను పిండి
అమృతం ఒలికించాలి
కర్మాగారమ్ములందు
కళలను పలికించాలి ॥విలా॥

పూలలోని అమాయికత
ఆలంబము కావాలి
అమృతాంశుని త్యాగశీల
మాదర్శము కావాలి ॥విలా॥



ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!
చల్ల చల్లని తీగె
తల్లి యొడిలో నూగు
ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!
చివురు టాకులలోన
రవల రేకులలోన
మంచు ముత్యాలుంచి
మంచి మధువుల నించి;
ఉదయభాను కరాల
సుధలు జారే వేళ
ప్రకృతిలక్ష్మి దివ్య
పాదపూజలు చేసి;
ఎన్నో నోములు నోచి
ఎన్నో జాములు సైచి
నిన్ను గనె నీ తల్లి
నిండు మమతల వెల్లి.
జీవనాడులలోని
శీతాంబువుల బోసి

పాల వెన్నెలలోని
పచ్చి మీగడ దీసి
తన మేని పొరలనే
నునుపాన్పుగా జేసి;
ఎంతో గారాబుగా
ఎంతెంతో డాబుగా
కడుపార పోషించె
మనసార ప్రేమించె.

ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!

మొగ్గ :

ఎవరో
ఎవ రెవరో ?
ఎల తలపులలో
కలవరమిడు వా రెవరో ?
తెమ్మెర బాటల ప్రాణము పోసీ
కమ్మని పాటల గానము చేసీ
తొలి వలపులలో
గిలిగింత లిడే రెవరో?

తుమ్మెద :

ఝుం—ఝుం—ఝుం—ఝుం

నేనే
తుమ్మెదనే
నిను వలపించే యెదనే;

ఝుం—ఝుం—ఝుం—ఝుం

నీ కనుసన్నల నీడలలోన
నీ నును వన్నెల జాడలలోన

నిలిచి తపించే తుమ్మెదనే
నీకయి నా బ్రతుకమ్మెదనే.

మొగ్గ :

ఓహో
ఓహోహో

నీవే తుమ్మెదవా
నను ప్రేమించెదవా

కలలను రేపితి వీవేనా
తలపుల నూపితి వీవేనా

నీవేనా తుమ్మెద రాణా
నీవేనా తుమ్మెద రాణా.

తుమ్మెద :

నేనే
నీ మనసున నవ

ప్రేమలు నాటితి నేనే
ఝుం—ఝుం—ఝుం—ఝుం
నీ చిరునవ్వుకు వేచియుంటినే
నీకై నాకము దాచియుంటినే.

మొగ్గ :

ఝుమ్మని ద్రిమ్మరు తుమ్మెద రాణా!
నీ కలగాన సుధా ధుని లోన
కిల కిల నవ్వెదునా
వలపుల రువ్వెదునా.

తీగ :

నవ్వకే నాయమ్మ !
నవ్వబోకే తల్లి !
మల్లికను విడనాడి
మధుర గీతులు పాడి
మధురసమ్మును గ్రోల
మరిగినాడే బాల.

మీబోటి మొగ్గలను
మెల్లగా నవ్వించు.
తీయ తేనెలు ద్రాగి
హాయిగా విహరించు.

కాంతుదీరినయంత
కనరాడు నీచెంత.

నవ్వకే నాయమ్మ
నవ్వబోకే తల్లి.

తుమ్మెద :

ఝుం—ఝుం—ఝుం—ఝుం
[తిన్నగా వెళ్ళిపోతాడు]

కవి :

ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!
నీతల్లి మాటలను
ఆలించినాడేమొ

అదో వెళ్ళుతున్నాడు
కొదమ తుమ్మెదరేడు
ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!

* * *

తుమ్మెద :

ఓ గాడ్పు చెలికాడ!
వేగిరమ్మో జాడ
సాగిరమ్మొక మాట
వినిపింతు నీపూట.

పవనుడు :

ఏమోయి తుమ్మెదా
ఏమిటూ నీ రొదా.
ఏ వన్నె విరికన్నె
పై వేసితివి కన్ను.

తుమ్మెద :

సరిగ ఊహించేవు
పవన మిత్రమ నీవు.
నవ్వెదట ఆ కోన
మువ్వన్నె పూజాణ.
నీవు నేనూ కలిసి
నవ్వింత మెచ్చైన.
తేనియలు నావంతు
తావులే నీవంతు.

పవనుడు :

బాగుంది అళిరాజ !
సాగిపోదము రమ్ము
సార్థకము జేతు నా
గంధవహ బిరుదమ్ము.

* * *

[ తుమ్మెద, తెమ్మెర, మొగ్గను సమీపిస్తాయి ]

తుమ్మెద :

కన్నులలోనే కమ్మని తేనె క
ణమ్ములు దాచిన దెవరో ?

పవనుడు :

తావుల జిమ్మే మోవి కిన్నెరలు
మ్రోయించని వారెవరో ?

తుమ్మెద :

కలగీతి పాడేను.

పవనుడు :

గిలిగింత సలిపేను.

తుమ్మెద :

నవ్వవే ఒకసారి
నా అనుగు రాణీ !

పవనుడు :

నవ్వవే ఒకసారి
నా వలపు బాణీ !

కవి :

కలగీతి పాడినా
గిలిగింత సలిపినా

ఆకులను గ్రుమ్మినా
రేకులను చిమ్మినా
నవ్వకే వారెంత
కవ్వించిపోయినా
నవ్వకే వారెంత
నవ్వించ దలచినా.

తీగ :

నవ్వకే నాయమ్మ !
నవ్వబోకే తల్లి !

మొగ్గ :

నవ్వనే నా తల్లి !
నవ్వలేనో కవీ !

నన్నెంత రేపినా
నవ్వించ్చే లేరింక.

నవ్వి శాపగువమ్ము
నలిపి వేయుటకన్న
నవ్వకయె లోనున్న
క్రొవ్వలపులే మిన్న.

నవ్వనో తుమ్మెదా !
చాలించు నీ పాట.

నవ్వనో తెమ్మెరా
సాగిపో నీబాట.

కవి :

ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!
చల్ల చల్లని తీగె
తల్లి యొడిలో నూగు
ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!

